23-4-54



# తారాపథం



నేషనల్ ఆర్ట్ థియేటర్ వారి తొలిచిత్రం "తోడుదొంగలు" ఈనెల 12 తేది సాయంకాలం వాహినీ స్టూడియోలో ప్రివ్యూ చూపించారు. ఈ రోజుల్లో అనేక చిత్రాలు పత్రికలవారు చూడకుండానే విడుదల అవుతున్నాయి. కొద్దిచిత్రాలను విడుదల అనంతరం చూపుతున్నారు. కొన్నిటిని అసలు పత్రికలవారికి చూపటమేలేదు. అటువంటి సందర్భంలో "తోడు దొంగలు" చిత్రం విడుదలకుముందే పత్రికలవారి ఎదటికిరావటం నిర్మాతల ఆత్మవిశ్వాసాన్ని సూచిస్తోంది. వారి ఆత్మవిశ్వాసాన్ని చిత్రం సమర్థించగలిగి ఉంది కూడాను.

"తోడుదొంగలు" కథ చాలా సరళమైనది. అన్నపూర్ణా రైస్ మిల్స్ యజమానీ మేనేజరూ తోడుదొంగలు. ఒకనాడు రాముడనే పనివాడు మిల్లుకప్పుమీద బల్బు పెడుతూ ఎలెక్ట్రిక్ షాక్ తగిలి కిందపడి మరణిస్తాడు. తోడుదొంగలుగుట్టు చప్పుడుకాకుండా వాడి శవాన్ని కారులో తీసుకుపోయి కొండకింద పడేసి ఏమీ ఎరుగనట్టు వచ్చేస్తారు. దీనిమూలంగా మేనేజరు పరమేశంకి గుండెజబ్బు పట్టుకుంటుంది. చచ్చిన రాముడు పరమేశం అంతరాత్మను పీడించసాగినాడు. వైద్యులనూ జ్యోతిష్కులనూ సంప్రదించి తాను ఒక్క నెలపైన జీవించడని తెలుసుకుని పరమేశం పట్నం వెళ్ళి వినోదంగా బతకాలని చూస్తాడు. కాని అక్కడా రాముడు దయ్యమైపట్టి నానాబాధలూ పెడతాడు. పట్నంలో ఉండగా పరమేశానికి ఒక ఆదర్శప్రాయుడైన మేనేజరూ, సుఖంగా బతుకుతున్న కార్మికుడూ తటస్థపడతారు. యీ అనుభవంతో గుణపాఠం నేర్చుకుని పరమేశం తన యజమానిచేత రాముడి భార్యాబిడ్డలకు రెండు వేలు పరిహారం ఇప్పిస్తాడు. దీనిమూలంగా పరమేశంగుండె "గుండులాగా" తయారవుతుంది. కార్మికులలో ఆయన పలుకుబడి హెచ్చుతుంది. ఈ పరిణామాలు తనకు నచ్చకపోయినా వాటిని అడ్డే తాహతులేక మిల్లుయజమాని తాళపుచెవులను పరమేశానికి ఇచ్చేస్తాడు.

యిది ప్రబోధనాత్మకమైన నీతికథలాటిది. యిందులో రాముడు పరమేశం అంతరాత్మనుపట్టి పీడించటమూ, దీనిమూలంగా అతని నరాలు "తుక్కు-తుక్కు" అయిపోయి అతని జీవితక్రమానికి నెలరోజులు గడువు ఏర్పడటమూ, అతను పట్నంలో ఒక ఆదర్శప్రాయుడైన మిల్లుయజమానిని చూచి తద్వారా స్వస్వరూపజ్ఞానం పొందటమూ, కలలో అతనికి నరకం కనిపించటమూ, తిరిగి అతను రాముడి కుటుంబానికి మేలుచేయగానే వ్యాధియాపత్తూ పోవటమూ మొదలైన ముఖ్యకథాంశాలన్నీ కూడా ప్రబోధన కొరకు సృష్టించబడినవే. ఈచిత్రంలో, యజమానులకూ, కార్మికులకూ ఉండే సంబంధాలు నైతికదృష్టితో చిత్రించబడ్డాయి. కనుకనే పరమేశం అంతరాత్మకు అంత ప్రాముఖ్యం. దోపిడీచేసేవర్గంలో ప్రతిఒక్కడికీ అంతరాత్మ ఉంటుందని ఈచిత్రం చెప్పదు. అలాటి అంతరాత్మ లేనివాడు ఫాక్టరీ యజమాని ఈ చిత్రంలోనే ఉన్నాడు.

నైతికదృష్టి ప్రధానంగా పెట్టుకుని తీసినప్పటికీ ఈ చిత్రంలో వర్గపోరాటాన్ని పొత్తిగా తోసి పారెయ్యలేదు. ఆఖరున పరమేశాన్ని తిరిగి మేనేజరుగా పెట్టుకోవటానికి యజమాని నిరాకరించినప్పుడు పనివాళ్ళు సమ్మెచేస్తామని బెద-

రిస్తారు. దానిలో యజమాని లొంగిపోతాడు. అంతవరకూ కార్మికుల చేతిలో సమ్మె అనేది బలవత్తరమైన ఆయుధంగానే చూపబడింది. ఐనా వర్గసామరస్యం ఆదర్శంగా పెట్టుకున్నందువల్ల కాబోలు ఈ చిత్రంలో కార్మికుల చైతన్యానికి ఇంతకన్న ప్రాముఖ్యం చూపలేదు. (ఉదాహరణకు, పరమేశం పట్నంలో ఉన్న కాలంలో సరిఅయిన "నాయకత్వం" లేక యజమాని ఫాక్టరీని తలకిందులు చేసుకుని కార్మికులతో ఘర్షణలుపడి ఉండవచ్చు. ఈ యజమాని గండ కత్తెరలను ఎదుర్కొనటంలో ఏమంత సమర్థుడుగా చూపబడలేదు. దీనితోబాటు అతను "అంతరాత్మ" లేనివాడు కూడా గనక వర్గసంఘర్షణ ఏర్పడటానికి ఎటువంటి అభ్యంతరమూ లేదు.)

చిత్రంలో కథ చాలా సాఫీగా నడుస్తుంది. ఏ దృశ్యం కూడా అవసరాన్ని మించి సాగినట్టుగా ఉండదు. కొన్ని దృశ్యాలు కథనానికి అవసరమైన మటుకే ఉంచబడ్డాయి. ఇందువల్ల చిత్రం నిడివి హద్దులో ఉండిపోయింది. కథ వేగంగా నడిచింది.

ఈ చిత్రంలో ఉన్నది వాస్తవంగా ఒకే ఒక పాత్ర—పరమేశం. ఈ పాత్రను గురించే మిగిలిన పాత్రలన్నీ ఆయా సందర్భాలలో ఆయా సన్నివేశాలకు వాతావరణంగా ఉపయోగపడతాయి. రైస్‌మిల్లులో యజమాని, ఇంటిదగ్గర భార్య, పట్నంలో సుఖజీవనం గడిపే కార్మికుడూ అతని ఇల్లాలూ, ఇత్యాది ఈ ఉపపాత్రలన్నీ కథకు చాలా బాగా ఉపయోగించుకోబడ్డాయి.

పరమేశం పాత్ర చాలా శ్రద్ధగా తీర్చిదిద్దినట్టు కనిపిస్తుంది. ఈ పాత్రలో ముఖ్యమైన విషయం అంతస్సంఘర్షణ. స్థూలంగా చూస్తే పరమేశం అంతరాత్మ రాముడి దుర్మరణంతోనే తిరుగుబాటు చేసినట్టు కనిపిస్తుంది. కాని వాస్తవంగా అది మొదటినుంచీ పనిచేస్తూనే ఉంది. ఆ అంతరాత్మ ప్రబోధంతోనే తన యజమాని లాభాలకు కుక్కలాగా కాపలా కాస్తూ అతని వ్యవహారాలను నైపుణ్యంతో నెట్టుకొచ్చాడు. ఈ ప్రయత్నంలో కార్మికులకు అన్యాయం చెయ్యటానికి పరమేశం వెనకాడక పోయింది క్రూరత్వంవల్లకాదు. ప్రమాదవశాత్తూ రాముడు చనిపోయినప్పుడు ఏ ఇతర మానవుడికైనా ఎంతసంభ్రమం కలుగుతుందో పరమేశానికికూడా అంతా కలుగుతుంది. కాని ఆ క్షణంలోనే అతని అంతరాత్మ ఈ చావువల్ల మిల్లువాటాదార్లకు కలిగే బాధలనూ, నష్టాన్నీ మాత్రమే ఆలోచించి వాటినుంచి తప్పుకునే ఉపాయం అమలుచేస్తుంది. ఒకసారి రాముడి మరణం గురించిన అపాయంనుంచి తానూ, తన యజమానీ తప్పుకున్నాక పరమేశం అంతరాత్మ తిరుగుబాటు స్వభావాన్ని ప్రకటిస్తుంది. ఈ మార్పుకు సాక్ష్యంగా పరమేశం ఆ సాయంకాలం రాముడి ఇంటిచాయలకు వస్తాడు, మొగుడుపోయి ఏడుస్తున్న రాముడి భార్యనూ బిడ్డలనూ చూస్తాడు. ఇంటికి పోతాడు. బట్టలైనా విప్పకుండా భోజనమైనా చెయ్యకుండా పడుకుంటాడు. పాకతక్కెలకిందపడి గిలగిలతన్నుకునే రాముడు కలలోకి వస్తాడు; పరమేశం జీవితంలో తుఫాను రేపుతాడు. తన అంతరాత్మనుంచి పారిపోదామని పరమేశం చేసే యత్నాలూ, వేసేవేషాలూ ఫలించకపోగా ప్రేక్షకుడికి జాలికలిగిస్తాయి. ఈ ప్రయత్నంనుంచి విరమించుకుని పరమేశం ఇంటికి తిరిగివచ్చి రాముడికుటుంబానికి న్యాయంచేసిన ఈ క్షణం నుంచీ పరమేశంపాత్ర సౌమ్యపాత్రగా పరిణమిస్తుంది. పరమేశంలోని అంతస్సంఘర్షణ అంతం కాగానే ఆ పాత్రలో కలిగేమార్పు చాలా నేర్పుతో చిత్రించబడింది. ఈ మార్పు సంభాషణలద్వారానూ, నటనద్వారానూకూడా వ్యక్తం చేయబడింది.

మిగిలిన పాత్రలలో అత్యంత వాస్తవికంగా సృష్టించి, నటించినపాత్ర మిల్లుయజమానిది. ఇతనిలో అంతరాత్మ అనేది ఏ కోశానా లేకపోవటం మినహాగా ఇంకోలోపం కనబడదు. స్వార్థంతప్ప మరొకటి చూడటం అతనికి చాతకాదు. తోడుదొంగలలో ఇతను జూనియర్ పార్ట్నర్. ఇతనిలో ఒకవిధమైన అమాయకత్వం కూడా ఉంది. పరమేశం పాత్రను ఎన్. టి. రామారావు ఎంతసామర్థ్యంతో పోషించాడో, ఈ యజమాని పాత్రను గుమ్మడి వెంకటేశ్వరరావు అంత సామర్థ్యంతోనూ పోషించాడని చెప్పాలి.

పరమేశం భార్యాపుత్రులుగా హేమలతా, చలం స్వభావసిద్ధంగా నటించారు. రాముడుగా ముద్దాలి కృష్ణమూర్తి, రాముడి భార్యగా కమలా దేవి, పట్నంలోని కార్మికుడుగా పుండరీ కాక్షయ్యా, డాక్టరుగా శివరామ కృష్ణయ్యా, తదితరులూ తమ పాత్రలను చక్కగానే నిర్వహించారు.

కథా డైరెక్షనూ యోగానంద్ గారే కావటం చేత కథావానికీ, డైరెక్షనూ మధ్య ఎక్కడా ఘర్షణ కనిపించదు. జూనియర్ సముద్రాలగారి సంభాషణలూ, పాటలూ చిత్రం రక్తికట్టటానికి అపారంగా తోడ్పడ్డాయి. కొన్ని చోట్ల రహమాన్ గారి ఫోటోగ్రఫీ చిత్రానికి చక్కగా జీవం పోసింది. పరమేశం పట్నంవచ్చినప్పటి టాప్ షాట్స్ పరమేశం ప్రాణానికి పట్నం ఎట్లా కనిపించిందీ చిత్రించటానికి చాలా బాగా తోడ్పడ్డాయి. స్వర్గ నరకాలను కూడా కామెరా కొత్త రకంగా చిత్రించింది. పరమేశం చచ్చిపోవటానికి పడుతున్న బాధను వెనక వరాండాలో కార్మికులు భజనచేస్తుంటే మెరుపులూ, గాలీ చక్కనివాతావరణాన్ని కలిగించాయి.

చిత్రంలోని పాటలన్నీ కథకు అనుకూలంగానే ఉన్నాయి. రాజాగారి సంగీతం ఇంపుగా ఉంది. దేవలోకంలోని భరతనాట్యాలు చాలా బాగున్నాయి. డాన్స్‌మాస్టర్ హీరాలాల్ అభినందనీయుడు.

మొత్తంమీద "తోడుదొంగలు" ఆనందించదగిన చిత్రం. కథావస్తువు సర్వసామాన్యమైనదిగా కనిపిస్తున్నా కొత్తదనం కలిగిఉంది. కథలో కరుణహాస్యాలున్నాయి. ఈ కారణాలచేత ఇది సులభంగా ప్రజాదరణ పొందగలుగుతుందనీ, ఆర్థికంగా విజయవంతమవుతుందనీ ఆశిస్తున్నాం.

* * *

ఏప్రిల్ 14వ తేదీ రాత్రి 9-10 గంటలకు మేకప్ మంగయ్యగారు కాలధర్మం చెందారు. ఆయన వయస్సు 46 సంవత్సరాలు మాత్రమే. తెలుగు సినిమాలు పుట్టిన నాటినుండీ సినిమా మేకప్‌లో అనుభవం సంపాదించి, మేకప్‌మాన్‌గా పెద్దపేరు తెచ్చుకుని, మూడుతరాల సినిమా తారలకు మేకప్ చెయ్యడమేగాకుండా మంగయ్యగారు ఎంతోమందిని మేకప్‌లో తరిఫీదు చేశారు. మేకప్‌లో మంచిపేరు తెచ్చుకుని ఇప్పుడు అశ్వరాజ్ సంస్థను నిర్వహిస్తూ "అన్నదాత" చిత్రానికి నిర్మాతగా ఉన్న గోపాలరావుగారు మంగయ్యగారి మేనల్లుడు. మంగయ్యగారు మేకప్ ప్రారంభించిన చిత్రం అంజలీవారి "అనార్కలీ." మంగయ్యగారు మహర్షి లాటి మనిషి. ఆయన తత్త్వజ్ఞానివలె భగవధ్ధ్యానంచేస్తూ మరణించారు. ఆయన ఆత్మకు శాంతికలుగుగాక!

---

"బుద్ధి లేక పరిజ్ఞానము చేతిని కల్పించెను, సృజించెను. జీవితసమరోల్లాసము దానికి శక్తిని సమర్పించెను. కాలము దానిని సంస్కరించెను. తుచ్ఛ జీవితము దానిని నిందించి తిరస్కరించెను. పశు జీవితము దుర్వినియోగము చేసెను. ఆధ్యాత్మిక జీవితము దానిని ప్రయోగించెను. జ్ఞానము దానిని నియమించెను. అభ్యాసము దానికి శిక్ష నొసంగెను. ప్రభువు,– రాజు అగు కళ దానిని వరించెను."

జడమతీ! నీ బుద్ధిని దానియందు ప్రవేశపెట్టుము. నీ మనః పాటవమును, చాతుర్యమును దానిద్వారా ప్రదర్శింపుము. నీ చేతులద్వారా ఆత్మశుద్ధిని పొందుము. పై వర్ణనలోని రహస్యమును గుర్తింపుము, అవగతము చేసికొనుము. అప్పుడు జీవితము నీకు సమర్పింప జాలని దేదియు నుండదు.

—("సంతోషము" నుండి)